ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య ౧౬.

శ్రీరస్తు.

# హాస్యరంగములు.

గ్రంథకర్త.

కొత్తపల్లి - సూర్యారావు.



మొదటికూర్పు 200 ప్రతులు.

చెన్నపురి:

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1 9 2 5.

వెల, ౮ అణాలు.

# విన్నపము.

ఇట్టి చిన్నిరంగము లనేకములు నాచేఁ జాలనాళ్లక్రిందటనే రచియింపఁ బడినవి. అసంపూర్ణముగ నున్నరంగములు మఱియుఁ గొన్ని గలవు. కొన్ని యశ్రద్ధచే నెందో పోయినవి. ఉన్నవానిలో నచ్చినవి యేఱి యిం దీయాఱు మాత్రము ప్రకటించుభాగ్యము గంటిని. వీనిని రచించుటలో నా ముఖ్యమైన యుద్దేశము "చౌచా" అని పిలువఁబడు నాటకములవలెఁ బ్రదర్శించుట కనుకూలముగా నుండు ననియే కాని భాసమహాకవి ననుకరింపవలయునని కాదు. విశేష విషయమును సంగ్రహించి వ్రాయుటలోఁ గొంత యుత్సాహము నాకున్నమాట సత్యము.

ఇందలి కథలు: — 1 క్రోధశాంతి, హారవిలాసములోని చిఱుతొండనంబి చరిత్రములోనుండి గ్రహింపఁబడినది. 2 ప్రభుసందర్శనము, మాపిల్లవాఁడు చదువుకొనుచున్న యింగ్లీషు పాఠపుస్తకములోని The Babes in the wood అనుదానినుండియు, 3 దేవసహాయము, Good deeds are never lost అనునొక కథనుండియు, 4 కావ్యకౌబేరము, క్షేమేంద్రమహాకవి కళావిలాసము నుండియు, 5 ప్రియగవేషణము, వికార్ ఆఫ్ వేకు ఫీల్డులోని హెర్మిట్టు పద్యములనుండియు, 6 అర్ధరాజ్యము, మహాభారతమునుండియు గ్రహింపఁబడినవి.

కథ నెట్లు గ్రహించితినో యెటులు విస్తరించితినో యేరీతి సంగ్రహించితినో యేగతిఁ బ్రమాదములకు లోనైతినో వేత్తలు పరిశీలించి గుణము లున్న గ్రహింతురుగాక.

కొత్తపల్లి - సూర్యరావు.

శ్రీమదుమారమణాయ నమః.

# హాస్యరంగములు.

## నాంది.

---

శా. రత్నోపేతము లుంగ్రము ల్దొడిగి ధర్మన్యాయసంకల్పము
ద్యత్నం బొప్పఁగఁ జేసి ప్రాభవము ముద్రాయత్త మార్జించి ని
ర్యత్నం బైన ననామికాత్వమును బాయన్లేని వ్రే లట్లు స
ద్యత్నుం డయ్యె ననామకుం డయినసూర్యారావు నాలింపరే.

అతఁడు రౌద్రిఫాల్గునమాసములో దర్శమహాపుణ్యకాలమున దండకారణ్యాంతర్గతవిస్తారణ్యస్థ హ్యాత్త్రాపనాశనీతీరసుప్రసన్నుం డైనవీరరాఘవస్వామిని సందర్శింపవచ్చిన భక్తవరులతో నిట్లు విన్నవించుచున్నాఁడు.

ఓభక్తాగ్రేసరులారా? భూతభవిష్యద్వర్తమానము లెఱింగినమీరు, సమయ మెఱిఁగి జనసహాయము తగ్గియున్న నన్నుంగూర్చి యామహాత్మునకు నివేదింపరా! ఆపుణ్యాత్ముఁడు నూరకున్న నాలేఖిని మూలఁ బడవైచి పుస్తకసన్న్యాసముం జేసెదను.

నటి—(ప్రవేశించి) ఆర్య! మనకవిపరిదేవనమేనా యిది.

సూత్ర—శాంతము పాపము! ఇది పరిదేవనమా.

నటి—ఎప్పుడును లేదో లేదో యని.

సూత్ర—ఇం దసత్య మే మున్నది.

క. అందఱు దేశోద్ధారకు, లందఱు భాషాభిమాను లందఱు భాషా
సుందరికి మగల మందురు, పొందినదుర్దశలు దేశమును విడిచెనొకో.

నటి—మఱి మనకవికి గండపెండారము లెట్లు వచ్చినవి వచ్చినను దారిద్ర్యమేల పట్టినది.

సూత్ర—ఈకవికిఁ గవిరాజులు పండితులుఁ గూడి గండపెండారములు వేసిరి.

నటి—అపుడు జనాదరము తగ్గిన దను నే. అనామకుఁ డెట్లు. ఎందులో నీతనిప్రసిద్ధి? ఏప్రసిద్ధి కీబిరుదములు.

సూత్ర—సన్న్యాసియు సన్న్యాసియుఁ గౌఁగిలించుకొనిన బూడిద రాలినది.

నటి—కవిరాజులు పండితులు—నిజమే వీరికి ధన మెక్కడిది.

సూత్ర—కవిరాజు లనినఁ గవిరాజులు గారు.

నటి—మరి పండితులు నీకవిరాజులు వీని కేల బిరుదములం దొడిగిరో.

సూత్ర—ఆ ప్రసంగము.

ఉ. ముప్పదిరేండ్లు గ్రాలెను ముక్కున మూలము లేని రోగముల్
ముప్పిరిగొన్న లోఁగ నసము ల్కవిరాజులు బేలుపోయి రీ
త్రిస్థలవ్యాధులం దొలఁచు దివ్యభిషక్కిటి జానకీశుఁడే
తప్ప నొకర్ల లారె బిరుదంబులు నీకొక లెక్కలోనివే.

[illegible]—

గీ. రిప్పుఁ గాంచి యేనని కవంగి నిష్ఫల, యత్నులైన వైద్యరత్నములను
జనులు నవ్వకుండఁ జనకుఁ డాతనిదరి, కనుచు గుప్తగాఁగఁ గొనుము వీని.

అని కాలికి బిరుదములు తొడిగిరి.

నటి—ఇదియా కారణము. వైద్యుల చేతఁగాక వీరు రాఘవస్వామికడియములం దొడిగిచూచిరా! ఇంక వ్యాధియుండదు. దారిద్ర్య మేల వచ్చినది.

సూత్ర—గీ. దాంభికులు మోసపుచ్చి పుస్తకము లంది
కొని ప్రతిశ్రుతమీక చిక్కువఱుపంగఁ
జూతు రిది కొంత జనము విశుద్ధమేని
లేదు లే దని మొఱవెట్ట వేఁదుజేమి.

నటి—అట్టిచో నిర్యత్నముగ మిన్నకుండరాదా.

సూత్ర—ఓసి వెఱ్ఱిదాన! ఎవ్వ రేపని చేసినను దేశోద్ధారమునకే కదా. దంభము లేక యొనర్చిన పనివలననే కదా—లోకము బాగుపడును.

నటి—కవులలో భాషావిషయములో దంభము లున్నవా.

సూత్ర—గీ. పిట్టకథ వ్రాసి యొకజగజెట్టిఁ గోరి
పీఠిక పదింతలుగ వ్రాయవేఁడి చేర్చి
పీఠిక ప్రశస్తిఁ జెప్పుము వెనుకముందుఁ
జూపి రని దాంభికులో వారు శుద్ధమతులో.

నటి—అట్టిదానికి వా రింతకీకిక యేల వ్రాసెదరు.

సూత్ర—వారిదంభము వారిది. వీరిదంభము వీరిది.

నటి—జనులు చక్కగా మోసపోవుచున్నారు సంతమెఱుఁగులే గాని చక్కని కృతులు చేయ రేల.

సూత్ర—మోసకృత్యమే జనులను సులభముగా నాకర్షించును.

గీ. లక్క వెట్టి కుండలమ్ములు బంగారు, మక్క వెట్టి మంచి ముత్తెముక్క
తుక్క వెట్టి పటుపుదూదిని విడియట్టి, ముక్క వెట్టి చిత్తమును హరింత్రు.

నటి—లోక మంతయు మోసమే.

సూత్ర—స్వార్థమను లం జెంటబో గలుగు.

నటు—స్వార్థమేమి పరార్థమేమి.

సూత్ర—స్వార్థమున -

గీ. గ్రుడ్డికంటికిఁ దగిలించుకొనును గాజు, మొండి చేతికి 'రబ్బరు' మూఁతవెట్టు
కుంటికాళ్లకు 'బూడ్సు'దొడ్గును జనంబు,కలదికలయట్లుచూప నుంకంబు గలదో.

నటి—జనులు మోసములను బహుకాలమునుండి సత్యమని నమ్ముచున్నారు.

సూత్ర—చెప్పెదను వినుము.

ఉ. గారడివాఁడు నాణెములు గా రచియించును మంటిపెళ్ల బం
గారుగఁజేయు నంతయును గల్లయన న్ననుకట్టుటన్న ని
ష్కారణవైరకల్పనము గన్గొననోపవు వానిశక్తి యం
ద్రారయ రట్టి శక్తిగల యాతఁడు ముష్టికి వచ్చునే చెలీ.

నటి— వారొనర్చినవి మనచేతిలోఁ బడిన మాయమగును.

సూత్ర – నీకును వెట్టి - నాచేతి కిమ్మను - చూచెదను.

నటి—లోకములో మీరో నేనో యెవ్వరో మోసమునకు లోపడియున్నారము.

సూత్ర—దొరసానులకు మంచిగేదంగులు లేకనా గుడ్డగేదంగులు -

నటి—ఇది పరార్థము. చిన్ననాటకముల కింత పెద్దనాంది యేల - ఇది మీావం
భముగదా.

సూత్ర—సభవారి యాజ్ఞ యిది.

నటి—ఎట్టివి ప్రదర్శింపఁగోరిరి.

సూత్ర—ఒక్క నెలలో జరుగఁదగినప్రదర్శనము లొక్కొక్కగంటలోఁ బ్రదర్శం
పఁగోరిరి.

నటి— దీని కుపాయమేమి.

సూత్ర—ప్రదర్శించి తప్పులున్నఁ బ్రథమప్రయత్న మని మన్నింపఁగోరుట.

నటి—లోకము చేయుమోసములకు లొంగక - చేసినచేయి యూరకుండక
మనమిత్రరత్న మేమైన నిట్టికార్యములో మనకుఁ దోడుపడు ననునమ్మకము
మీాకున్నదా.

సూత్ర—ఉన్నది కావుననే నడుముకట్టి తాంబూల మందికొంటిని.

నటి—నీ మాటకుఁ దగినపాటకాఁడు దొరకినాఁడు.

సూత్ర—ఇదియే యన్నింటికి నాందిగా నొకగాన మారంభింపుము.

నటి— చూడుఁడు గానము చేసెదను.

చ. తపమున శాంతి జంతువితతప్రియభావము సత్కృతోద్యముం
గుపితమనస్కతం గనుట క్రోధముదీఱఁగ వేఁడికొన్న న
చ్చపుఁగరుణాకటాక్షము భృశంబుగ మానులచర్య యెన్నఁగా
నుపమయగుం బ్రసక్తకథ కూర్జితవృత్తిని జిత్తగించినన్.

సూత్ర—అగును - నీమాటల వెంబడినే దుర్వాసోముని వచ్చును గనుము.

నటి—అమ్మయ్యో నాకుభయము! ఆయనపేరు సింహాస్వప్నము.

సూత్ర—మఱి నీవు లోనికిఁ బొమ్ము.

నటి—దారిలో నాముని యెదురుపడు నేమో.

సూత్ర—నేను గూడ వచ్చెదను, పదపదము. ఆర్యులార! ఒక్కింత నాకు సెలవిండు.

(నిష్క్రమించుచున్నారు.)

శ్రీ మహామారమణాయనమః.

# ప్రస్తావనారంగములు.

## ౧. క్రోధశాంతి.

(దూర్వాసుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దూర్వా—(పర్ణశాలయెదుట) ట్రి. ట్రి. ట్రి. రా. రా. డొక్కలు దించుకొని పోయినవి. దా. దా. ట్రిటా. ట్రిటా.

(లేడిపిల్ల ప్రవేశించుచున్నది.)

దూ—(చేత నివ్వరిధాన్యము చూపి) ఆఁకలిగానున్నపుడు దగ్గఱకు రారాదా. యడుగరాదా. దా. దా.

లేడి—(వచ్చి తినుచున్నది.)

దూ—బా. బా. తిను, తిను, భయము లేదు.

లేడి—(చనవున మునియొద్ద గంతులువేయును.)

దూ—ముందు రెండునోళ్లు తిను - గంతు లానక వేయవచ్చును.

లేడి—(చేతిలో నోరు పెట్టి - బెదరి దూరముగాఁ దొలఁగును.)

దూ—ఆఁ! దా. నాకు స్నానమువేళ యైనది. పెంకితనము తర్వాతఁ జేయుదువుగాని - ప్చు - ప్చు.

లేడి—(ఆకసమువంకఁ జూచి బెదరి పాఱిపోవును.)

దూ—(ఇటు నటు చూచి) ఆఁ! ఎవ్వఁడురా, నాబిడ్డలేడిని బెదరించినది. ఎవ్వరును గనఁబడరు! కారణము లేక యేల తిండిమానిపోవును. ఎవ్వఁడురా! నాతోఁ జరలాటమాడువాఁడు!!

క. ఇంద్రునకుఁ జుక్కయెదురు ను, పేంద్రునకుం బ్రక్కబెదరు ఋషిమండలపా
 రీంద్రముఁ గడుపా చెఱువా, సంద్రముతోఁ జౌటిపడియసాటి నెదుర్పన్.

రారా; నాతో డాఁగుడుమూఁత లాడెదవు. ఎదుటవచ్చి నిలువుము. ఓరీ నీచుఁడా! ఒక్కనాఁడు నొక్కనికి నోడనివాఁడను - కృష్ణద్వైపాయనునితో నెదిరించి సమమైతిని గాని యీపస్నాత్రముఁ దీసిపోనివాఁడను.

శా. శాపం బిచ్చిన దన్న మానక మనశ్చాంచల్యరాహిత్యమే
సౌఖ్యార్తిన్ శపియించి కృష్ణసుతు రక్తప్రస్ఫురన్నేత్రతన్
కోపింపం గుపితుండు గాక నను ద్రొక్కించెన్ యథావత్కథా
లాపం బాత్మకృతార్థవత్కథల సూయల్మెచ్చ వ్యాసుం డొగిన్.

పాపిష్ఠ! నీవు నాజ్ఞాతివా! నీ నానడుమ నేమైన నభియోగ మున్నదా! ఏమే
నపకారము చేసితినా! నిష్కారణము దుష్కార్యమునకు విజృంభించితివి!
నా దేమితప్పు!

శా. నోరు న్నాయమను లేని లేడులకు వానుల్గూర్తు రత్యంతమున్
హారాభాఃభయప్రమాదముల నిత్యం బేనురక్షించునీ
సారంగాక్షక మేమిచేసె నిను మెచ్చంబోవె, పోని మ్మెదు
క్కోరాదో పెకరింపరాదో నను నీకుం బౌరుషం బున్నచోన్

న్యాయరీతి నాతప్పు లెంచి తిట్టినను నే నోడింగ్రక్కైనను. అన్యాయముగ దుర్జన
లక్షణం బగునీవ్యర్థచేఁ బిష్టుకపై బ్రహ్మాస్త్రప్రయోగము చేయుచున్నాఁ
డవా. మూర్ఖా! ఖలువా!

గీ. మేనకచలంబు కౌశికు మేటి కిన్క, కణ్వునబ్రహ్మతేజం బఖండమండ
లాధిపుం డగుదుష్యంతునాధిపత్య, మింత లెక్కింప మ్రుక్కడి వేమిలెక్క.

నీ వమర్త్యుండవా మర్త్యుండ వగుము. నరుండవా నిరుండుండ వగుము. గగన
చారివేని భువనపతనంబు నిక్క మగును. నాగలోకవాసివేని నిన్నధః
పాతాళమున కణఁగఁ ద్రొక్కెదను. నాక్రోధంబు బారినుండి నిన్నుద్ధరింపఁ
ద్రిలోకంబుల నొక్కరుండు గలఁడా! భద్రా! భద్ర! నాకమండలు వేది.

శిష్యుఁడు—(ప్రవేశించి) ఎవ్వరిమీఁదనో కోపదృష్టి నున్నవారు, (సమీపించి)
నే నొలుకఁబోయ లేదు (వడఁకును)

దుర్వా—రెండవవాఁ డెక్కడ?

శిష్య—సమిధలు తేఁబోయెను. (వడఁకుచు) నేను గమండలువును దాఁకనే
లేదు. ఒట్టు. నే నొలుకఁబోయలేదు.

దుర్వా—నే నే మడిగితిని. నీ వేమి చెప్పుచున్నాఁడవు?

శిష్య—గంధర్వునిశపించుటకుఁ గమండలూదక మడుగుచున్నారు.

దూ—గంధర్వుఁ డెవఁడు?

శిష్య—బెదరి నాల్గుకాళ్లు గుప్పించి యెగిరినపుడు లేడిపిల్లవలననే కమండ
లువు తిరుగఁబడిపోయినది కావచ్చును.

దూ—విమానచారి యెవ్వఁడో గంధర్వుంజూచి బెదరినదా! ఈగంధర్వుని విమానము వానిగర్వముతోడి మానమును గ్రిందికి డించెను. భద్ర! మఱి కమండలు వేది?

శిష్య—ఉటజద్వారమున బోరగిలఁబడి యున్నది.

దూ—ఎవ్వరొలుకఁబోసిరో యెఱుఁగవా?

శిష్య—నే నెఱుఁగను. నేను జూడనే లేదు.

దూ—నీవుగాక నేనుగాక మఱి యుటజములో నెవ్వ రున్నారు. ఒకవేళఁ గోపములో నొడలెఱుఁగక నేనే యొలుకఁబోసి బోర్లఁద్రోసితినా.

శిష్య—అట్లయి యుండదు.

దూ—నాకుఁ దగినశిష్యుఁడవు - నీవుగాదు, నేనుగాదు, నీవుచూడ లేదు.

శిష్య—భయపడి పరుగెత్తులేడిపిల్ల కాలు దగిలి పడినదేమో.

దూ—(విని) అలాగా! పోనీ పాపము దాని కేమి తెలియును. ఆ! ఓరీ కష్టాత్మ! నామృగమే నీకంటెఁ బడినదా! నీవు నాకంటిమంటఁ బడియెదవు. భద్రా! గంధర్వుఁ డంటివిగదా.

శిష్య—విమాన మొకటి గగనమునఁ బోవుచుండ భీతిచే -

దూ—ఆఁ! నానెత్తిమీఁదినుండి విమానమును నడపెనుగా. నీవుపోయి కుండిక కడిగి మంచినీరు త్వరగాఁ దెచ్చెదవా.

శిష్య—ఆజ్ఞయైనఁ దెచ్చెదను.

దూ—పోనిమ్ము. నీ రెందుకు, నోరులేదా.

శిష్య—ఆచమనమైనఁ జేయవలదా.

దూ—వీనికై యింతశాస్త్రవిధాన మక్కఱ లేదు. కాని—ఏమని శపింపను? చెప్పుము.

శిష్య—నాకు మొదటనే శాపమన్న భయము.

దూ—తపోభంగ మనియా? నేను గోప్పిమ్ములలో వన్నెకెక్కినవాఁడ నైతిని. ఇఁక భయమేము.

శిష్య—ఆతఁ డీవృత్తాంత మెఱుఁగునో యెఱుఁగఁడో.

దూ—నేనిప్పుడు స్పష్టముగా నెఱిఁగించెదను. భద్ర! ఇందాఁక నాయెదుట నెవ్వరో నిలువంబడిన ట్లయినది?

శిష్య—పాపము! నారదుఁడు లేడిపిల్ల పాఱిపోయినపిమ్మట వచ్చినాఁడు. అతఁడు కాఁడు.

దూ—అతఁ డేఁడీ! తప్పుకొని పోయినాఁడా. అతనితెంపి నాకంటిలో నున్నది. ననాశ్రయించికొన్న నతనికి మృష్టాన్నము దొరకును. ఎవ్వఁడురా పుష్పకమెక్కితి నని గర్వించిన గంధర్వుఁడు. గర్వాంధుఁడు!

చ. ఒరుశకటంబు నెక్కి కడు నోరగిలంబడి నిక్కి చూచుచుం
దిరుగుడుగ్రుడ్లఁ, గాలిపయిఁ దీర్చినకాలును గాఁ బరిభ్రమిం
తురు పురిలోఁ బలోవరులతోడ మదాంధులు మిన్నుముట్టఁగా
చరిగెడు నీఖచారి కనునా వనవాసులకష్టసౌఖ్యముల్.

శిష్యు—స్పష్టముగా గంధర్వుఁడే - మగనాలుకూడఁ బ్రక్కనే యున్నది.

దూర్వా—ఎవ్వఁ డయియుండును! ఇపు డేవాఁ డేవంశమువాఁడో తెలిసి కొనుట కష్టముగానే యున్నది. వత్స! గంధర్వులకుఁ బ్రక్కనే మగనాం డ్రుండుట నీ కానవాలా.

శిష్యు—అదిగాక నరులు విమానము లెక్కుదురా.

దూ—నీ వెఱుఁగవులే - మఱి యీగంధర్వుఁ డెవ్వఁడందువు?

(తెరలో - ధ్వని) మహాత్మా! క్షమియింపుము. క్షమియింపుము.

దూ—(విని) ఎవ్వరది, మొదలు శాపమే లేదు. క్షమియించుట యెక్కడ.

శిష్యు—(తనలో) నారదుఁ డేమో చెప్పియుండును.

దుర్వా—ఎదుటంబడి ప్రార్థించువానిం గన్నఁ గోపము తగ్గును. శాపము పణముగాఁ బడదు. నారదుఁ డీప్రక్కలనే యుండును.

గీ. హరిణపోతంబునాఁకలి యారలేదు, నాదుకోపంబు చల్లాఱలేదు శాప
విధాయులే దింతలో వచ్చురాయబారి, నారదునితోడ వీఁడు గంధర్వుఁ డకట.

మాటలే మంత్రములు, నీటితోఁ బనియేమి? వీరు నాయెదుటికి రాకమున్నె శపించెదను. గంధర్వుఁడే యైనచో -

క. ఎవ్వఁడు నామృగపోతము, నివ్వరులం దినెడువేళ నిలుగుచు నీక్షిత్
దవ్వుగఁ బాఱంద్రోలెనొ, యవ్వాఁ డిల మర్త్యజన్మ మంది కృశించున్.

(తెరలో) - మహాత్మా క్షమియింపుము క్షమియింపుము.

దూ—ఇపుడు రానీ చూతము. నాపరుగుఁ గలసికొన్నను. ఏ నారదుఁ డేమి చేయునో.

గంధ—(ప్రవేశించి) మహాత్మా! అజ్ఞానిని క్షమియింపఁదగును.

దూ—(తలయూఁచి) పాపము, అజ్ఞాని! వెన్న వెట్టినఁ దిననేర్చునా వ్రేలువెట్టినఁ గఱపనేర్చునా,

గంధ—మహాత్మా! ఏను మిమ్ముఁ జూచనే లేదు. నాదారిని నేను బోవుచున్నాఁడను. క్షమింపుము.

దూ—నాతలమీఁదినుండియేనా నీకుదారి.

గంధ—ఆశ్రమసమీప మని తెలిసికొనలేదు.

దూ—కన్నులు నెత్తిమీఁదఁ బెట్టుకొంటివా.

గంధ—అశ్లే యైనది; గర్వాంధుఁడను.

దూ—ఆలితో విమానమెక్కి మమ్ము గేలిచేయుచున్నాఁడవా.

గంధ—శివశివ! ఎంతపాపము! (పాదములపైఁ బడి) నామొదటితప్పు క్షమియింపవలయును.

దూ—ఎట్టూ! పో, నాయొద్దికి రాకుము. ప్రథమాపరాధమును మన్నింపవలయునని యేరాజైన శాసనము చేసియున్నాఁడా. పోపొమ్ము.

గంధ—రాజు లెంతటివారు; తాము మునిరాజులు శాసనములలో వార్తికములు చేర్పవలయును.

దూ—తలఁగు తలఁగుము. అజ్ఞానివి.

గంధ—సత్యముగా నజ్ఞానిని.

దూ—సత్యమే నీయజ్ఞానము నాకోపమును దెలిసికొనలేకపోవుటలోఁ గనఁబడుచున్నది. లేడి, అందునను బిల్ల, చేరెఁడుగింజలతో దానిపొట్ట నిండును, రెండుగింజ లందుకొననిచ్చితివా.

గంధ—ఆశ్రమమే చూడలేదు, లేడి నె ట్లెఱుఁగుదును.

దూ—బెదరించుట మాత్ర, మెఱుఁగుదువు.

గంధ—నేనేమి మీలేడి నేమి బెదరించుట యేమి. క్రూరమృగమునా, మృగయుఁడనా - వేఁట నెత్తిగల రాజనా.

దూ—నాలేడిప్రాణమునకు నీవు క్రూరమృగమవే. మాచర్యలు నీకుఁబరిహాసముగాఁ దోఁపవచ్చును.

గంధ—మీతోఁ బ్రతివచనము లాడఁజాలను.

చ. అది గ్రహచార మాతరుణమందునఁ బుష్పక మబ్బుమంపలం
బుపరియ మీఁదికిం జనియె, భూమిని జూడను—

దూ—కాలము తాఱుమాఱైనది. సంస్కారములు మెండైనవి. ఋష్యాశ్రమము మీఁదఁ గూడ నిరాఘాటముగా నేగుపుష్పకములు బైలుదేఱినవిగా. ఇంక నెన్నిపింతలు గనఁబోదుమో.

శిష్యా — ఔరా నేనునిను పొడగాంచి యుండవలసినదియే.

(చెట్లచాటునం)

బడిమాముగాఁ గుటీవసతి నల్లవో లేడిని మేపుమిమ్ము నె
య్యపుమనఁ జూడలేదు పరిహాసము సేయఁగఁ గండ్రొవ్వెకో.

అదియునుంగాక బ్రహ్మతేజోవిరాజితు లగుమునిరాజులయెదుట సానిమెఱుఁగుల గంధర్వజాతి సిగ్గుమాలి నవ్వఁబోవుటా!

శిష్యా — ఏల నామృగశాబకము బెదరవలయును.

గంధ — నాదినములకొలఁదిఁ జెట్లక్రీనీడలో నేనోయుబ్బు భయంకరాకారముగఁ బరాకునమున్నపుడు కనఁబడియుండును.

శిష్యా — అట్లయిన నేఁ జెప్పినట్లు చేసెదవా.

గంధ — కత్తిమీఁద నిలువు మనిన నిలిచెదను.

దూర్వాసుఁడు —

గీ. బుద్ధిపూర్వకముగ లేడిబుడుతకీవు, బెదరుపుట్టింప లేదటన్నది నిజంబ
యేని నాచేతినివ్వరి లింత పిలిచి, మేపు చూతము మటి మిడిమేల మేల.

గంధ — (విని) హా! ఇదియేమి! సత్యముగా నే నేమియుఁ దెలియనివాఁడనే. అయిన నపరిచితమృగము నేను బిలిచిన వచ్చునా. ఈలేడి నన్నుఁ బరీక్షింపుటకై వచ్చిన మాయామృగ మేమో — స్వామీ!

చ. కడుపునఁ గన్నబిడ్డ యొకకాలము తల్లియు మూఁడునాల్గునా
ళ్లెడపడి వచ్చి పిల్చిన మెయిం బుయిలోడును రాదు చేరఁగాఁ
జడిముడిపాటునం బఱచి చేఁగవచ్చునె క్రొత్తవాఁడ నేఁ
బిడికిట నివ్వరుల్గొనుచుఁ బిల్చిన యత్నము చేసి చూచెదగా.

దూ — భద్ర! కోపమునఁ జేతిలోని గింజ లెక్కడనో చల్లియుందును. పర్ణశాలలోఁ బోఁకదొన్నెలోని గింజలు కొన్ని తామరాకులోఁ బోసి తెమ్ము.

శిష్యా — చిత్తము. (అని పోయి తెచ్చి గంధర్వునకిచ్చును.)

గంధ — (ధాన్యముం జూపి) ఓసారంగశాబమా.

గీ. నను బరీక్షింప నెంచిన త్రినయనుఁడవో, తత్పరీక్షార్థసహకారి త్వన్మునీంద్రు
కోపహాసంబనో యెలుగోలుజల్లు, గురియుమ కటాక్షశిశిరామృతరస మిష్ట.
ఓకురంకబిడ్డా!

ఉ. నామొగ మెన్నఁడేఁ గనిన జ్ఞాపకమున్నదె నిన్ను నెప్పుడే
నేమునినాఁడనో తెలుపు మేటికి నాకిటునంటిశిక్ష యా

భామిని మేఁక లేడి యొక పోలికి మెత్తని జంతువు గదా
యీమెయిఁ బ్రాహ్మణభావ మది హేతువు లేకయ సంభవించునో.

ఓకరుణాహరిణమా! రా. అకృత్రిమహృదయముతో నాయందుఁ గరుణమాపుము. ఋష్యాశ్రమములో నెట్టియక్రమమునకు నెడము లేదు. అకల్మషభావముతోఁ బిల్చెదను. నాయొద్దికి నిష్కల్మషభావముతో రమ్ము. దా. దా. త్రిట్. త్రిట్. ప్స్. ప్స్. బాబా. నే నేనాఁడును లేడిని బెంచుట యెఱుఁగను. పిల్పుధ్వనులును నాకు రావు. కోడి నొకకేతిని, పావురము నొకపక్కిని బిల్లి నింకొకమాదిరిఁ గుక్క నొక్కలాగున దానిపిల్ల నింకొక్కలాగునఁ బిల్తురు. ఎన్నో భేదములు. పిల్పుధ్వను లైనను నాకు రావు. విమానములో నున్న నాయిల్లాలు కొంత మేలు.

శిష్యు—పోయి పిల్పి తెత్తునా.

గంధ—నాయత్నము విఫలమైనపుడు గదా. దాదా త్రిట్ త్రిట్. త్రిటుటు.

లేడి—(మెల్లఁగఁ బొదలోనుండి వచ్చి యిటునటుఁ జూచును.)

గంధ—నాయిష్టదైవము! నాకుఁ బ్రత్యక్షమైతివి. రారమ్ము. త్రిట్. త్రిట్.

లేడి—(సమీపించి-ముందంజలెత్తి గంధర్వుని మూఁపుపైఁ బెట్టి ముఖము మూర్కొని చేతిలోని ధాన్యముం దినును)

గంధ—(సగద్గదము) మౌనీంద్ర! నే నెవ్వఁడనో పరవశుఁడ నైతిని. (ఆశ్చర్య పడును.)

దూ—(తనలో) తెలిసినది. మేలు.

(ఆకాశమున—ధ్వని.)

సత్యము సత్యము. ఈగంధర్వుఁడు నిరాగసుఁడు. నిష్కపటి.

దూ—ఓనారద. నీమూలమున వచ్చినకలహమే యిది.

నార—(ప్రవేశించి) దుర్వాస! నీకోపము దీఱినది కావునఁ జెప్పెదను, నే నీశ్వరుని దర్శించి వచ్చుచు నీకీవృత్తాంతము దెల్పరాఁగా నాగవల్లితీఁగకు నావీణతంతి తగిలి మ్రోఁగినది. దీనికై లేడి బెదరియుండును.

దూ—మఱి యీతని కుపకృతి యేమి.

నార—ఇట్లు (అని చెవిలోఁ జెప్పును)

గంధ—క. ప్రారంభమునం దీతఁడె, కారణముం దెల్పఁ బిదపఁ గడసారి మునిక్
సారంగము మెప్పించినఁ, దీరుపు చెప్పంగ వచ్చె, దివ్యముని బలే.

గంధ—ఔరా చేసినపనికి దలవాంచి యుండవలసినదియే.

చెట్లచాటునం

బడిమాముగాఁ గుటీవసతి నల్లుచో లేడిని మేపుమిమ్ము నె
య్యపుమనఁ జూడలేదు పరిహాసము సేయఁగఁ గండ్రొప్పవో.

అదియునుంగాక బ్రహ్మతేజోవిరాజితు లగుమునిరాజులయెదుట సానిమెఱుఁగుల
గంధర్వజాతి సిగ్గుమాలి నవ్వఁబోవుటా!

దూ—ఏల నామృగశాబకము బెదరవలయును.

గంధ—నాదినములకొలఁదిఁ జెట్లక్రీనీడలో నేదో మబ్బు భయంకరాకారముగఁ
బరాకుననున్నపుడు కనఁబడియుండును.

దూ—అట్లయిన నేఁ జెప్పినట్లు చేసెదవా.

గంధ—కత్తిమీఁద నిలువు మనిన నిలిచెదను.

దూర్వాసుఁడు—

గీ. బుద్ధిపూర్వకముగ లేడిబుడుతకీవు, బెదరుపుట్టింప లేదటన్నది నిజంబ
యేని నాచేతినివ్వరు లింక పిలిచి, మేపు చూతము మఱి మిడిమేల మేల.

గంధ—(విని) హా! ఇదియేమి! సత్యముగా నే నేమియుఁ దెలియనివాఁడనే.
అయిన నపరిచితమృగము నేను బిలిచిన వచ్చునా. ఈలేడి నన్నుఁ బరీక్షిం
చుటకై వచ్చిన మాయామృగ మేమో—స్వామీ!

చ. కడుపునఁ గన్నబిడ్డ యొకకాలము తల్లియు మూఁడునాల్గునా
ళ్లెడపడి వచ్చి పిల్చిన మొయిం బుయిలోడును రాదు చేరఁగాఁ
జిడిముడిపాటునం బఱచి చేరఁగవచ్చునె క్రొత్తవాఁడ నేఁ
బిడికిట నివ్వరుల్గొనుచుఁ బిల్చిన యత్నముచేసి చూచెదన్.

దూ—భద్ర! కోపమునఁ జేతిలోని గింజ లెక్కడనో చల్లియుందును. పర్ణశాల
లోఁ బోఁకదొన్నెలోని గింజలు కొన్ని తామరాకులోఁ బోసి తెమ్ము.

శిష్యు—చిత్తము. (అని పోయి తెచ్చి గంధర్వునకిచ్చును.)

గంధ—(ధాన్యముం జూపి) ఓసారంగశాబమా.

గీ. ననుఁ బరీక్షింప నెంచిన త్రినయనుఁడవో, తత్పరీక్షార్థసహకారి త్వన్మునీంద్రు
కోపరూపంబవో యెలగోలుజల్లు, గురియుమ కటాక్షశిశిరామృతరస మిష్టు.
ఓ జింకబిడ్డా!

ఉ. నామొగ మెన్నఁడేఁ గనిన జ్ఞాపకమున్నదె నిన్ను నెప్పుడే
నేఁబిలిచానొ నా తెలుపు మేటికి నాకిటునంటిశిక్ష యీ

భూమిని మేఁక లేడి యొక పోలికి మెత్తని జంతువు ల్గదా
యీమెయిఁ గ్రూరభావ మది హేతువు లేకయ సంభవించునో.

ఓ తరుణహరిణమా! రా. అకృత్రిమహృదయముతోఁ నాయందుఁ గరుణమూపుము. ఋష్యాశ్రమములో నెట్టియక్రమమునకు నెడము లేదు. అకల్మష భావముతోఁ బిల్చెదను. నాయొద్దికి నిష్కల్మష భావముతో రమ్ము. దా. దా. ట్రిట్. ట్రిట్. ప్పు. ప్పు. బాబా. నే నేనాఁడును లేడిని బెంచుట యెఱుఁగను. పిల్పుధ్వనులును నాకు రావు. కోడి నొకరీతిని, పావురము నొకఫక్కిని బిల్లి నింకొకమాదిరిఁ గుక్క నొక్కలాగున దానిపిల్ల నింకొక్కలాగునఁ బిల్తురు. ఎన్నో భేదములు. పిల్పుధ్వను లైనను నాకు రావు. విమానములో నున్న నాయిల్లాలు కొంత మేలు.

శిష్యు—పోయి పిల్చి తెత్తునా.

గంధ—నాయత్నము విఫలమైనపుడు గదా. దాదా ట్రిట్ ట్రిట్. ట్రిటుటు.

లేడి—(మెల్లఁగఁ దెరలోనుండి వచ్చి యిటునటుఁ జూచును.)

గంధ—నాయిష్టదైవమ! నాకుఁ బ్రత్యక్షమైతివి. రారమ్ము. ట్రిట్. ట్రిట్.

లేడి—(సమీపించి - ముందంజలెత్తి గంధర్వుని మూఁపుపైఁ బెట్టి ముఖము మూర్కొని చేతిలోని ధాన్యముం దినును)

గంధ—(సగద్గదము) మౌనీంద్ర! నే నెవ్వఁడనో పరవశుఁడ నైతిని. (ఆశ్చర్య పడును.)

దూ—(తనలో) తెలిసినది. మేలు.

(ఆకాశమున—ధ్వని.)

సత్యము సత్యము. ఈగంధర్వుఁడు నిరాగసుఁడు. నిష్కపటి.

దూ—ఓనాదర. నీమూలమున వచ్చినకలహమే యిది.

నార—(ప్రవేశించి) దుర్వాస! నీకోపము దీఱినది కావునఁ జెప్పెదను, నే నీశ్వరుని దర్శించి వచ్చుచు నీకీవృత్తాంతము దెల్పరాఁగా నాగవల్లితీఁగకు నావీణతంతి తగిలి మ్రోఁగినది. దీనికై లేడి బెదరియుండును.

దూ—మఱి యీతని కుపకృతి యేమి.

నార—ఇట్లు (అని చెవిలోఁ జెప్పును)

గంధ—క. ప్రారంభమునం దీతఁడె, కారణముం దెల్పఁ బిదపఁ గడసారి మునీ
సారంగము మెప్పించినఁ, దీరుపుచెప్పంగ వచ్చె, దివ్యముని బలే.

దూర్వా—నీవు వచ్చినప్పటికే నిన్నుఁజూచి బెదరిన దని మాకుఱ్ఱవాఁడు చెప్పు చున్నాఁడు.

గంధ—(తనలో) అమ్మయ్య! ఆశాపము నారదునకుఁ దగులదు. పోనీ.

దూ—ఓగంధర్వరాజ!

గంధ—(తన) ఈపిలుపుతో నేను గృతార్థుఁడను. (ప్రకా) ఏమియానతి!

దూ—కారణ మీనారదుఁడు చెప్పెను.

గంధ—అంతయు మీయనుభావము.

దూ—నిన్ను భూలోకమునఁ బుట్టి కృశింప నుడివితిని.

గంధ—నిగ్రహానుగ్రహసమర్థు లెట్లాడిన నేమి.

దూ—దానినే కొంతమార్చు చున్నాఁడను.

నార—ఈసభలో నేను సభ్యుఁడ నగుదునో కానో. నేనేమైన సభకీయవలసి యున్నదేమో. కాని మొదటితీర్మానములోని కృశించు ననుపదము తీసివేయ వలయును.

దూ—నీవు గౌరవసభ్యుఁడవు కావున నుపపాదింపవచ్చును.

నార—అట్లైని "యిల" యనునది యాపర్యాప్తిం బొందినది. స్థలనిర్దేశము ముఖ్యము.

దూ—ఈక్రిందితీర్మానమును సర్వజనాంగీకృతముగ నిర్ణయించి దీనిప్రతి నొక దానిని గంచిలో మామిడిచెట్టునకు వ్రేలాడఁగట్టవలయును. ఆలకింపుఁడు.

మ. సిరితోండం డనుజంగమార్చకగణశ్రేష్ఠుండవై కంచిలో
నిరతంబుౘ్ శివభక్తులం దనుపుచుౘ్ శ్రీకంఠదీక్షౘ్ మహా
ధ్వరసాదృశ్యశివవ్రతంబున జగత్ప్రస్తావముం గాంచి కాం
తు రహిం గేనలకామ్యశైలనివసద్రుద్రప్రలీనం బొగిౘ్.

గంధ—ఇదినాకు శాపమా! వరము.

నార—ఈవరము నీవెట్లు కాపాడుకొందువో.

గంధ—మహాత్మా! దీనఁ గష్టమేమి గలదు. అరంటిపండువలె నున్నది.

నార—అట్లు గాదు. నిన్నుఁ బరీక్షింపఁ గోరి యనేకులు కొంటెభక్తులు శైవులు వత్తురు.

గంధ—ఏమిభయము! శైవం బగుపని యెంతకఠిన మైనదైనను నాకు సంతసమే! నాతండ్రి యేకామ్రనాథుఁడు గలఁడు.

నార—ఏమో! జాగ్రత్త.

ఉ. ఔ లుడికించి పెట్టు మని యంపముతోఁ దలఁగోసికొమ్మటం
చాలిని దెమ్మటంచు నిజహస్తమునం జెఱకాడి పానకం
బోలిని ద్రావని మ్మనియు నొక్కకుమారుని జంపి కూరగాఁ
బేలిచి యేకనం గుడువ విస్తరిలో నిడుమంద్రు చేసెదే?

గంధ—ఓహో! నన్నంతగఁ బ్రార్థించు నర్థివరులు వత్తురేని చరితార్థుండనుగదా!

దూ—ఈసత్యవంతుఁడు, నారదా, రెండవహరిశ్చంద్రుని దలపించును.

గంధ—(తన) భవత్కరుణావిశేషమున నీదాసుఁ డెంతకైనఁ జాలఁగలఁడు.

నార—నీవును నీధర్మపత్నియు నీవిమానమునఁ గంచికిఁబొండు.

గంధ—చిత్తము! (అని నడచి చూచి) ఆహా! అద్భుతము! దారుణశాపాక్షరములు వినినంతనే నామగువ మూర్ఛ వడినది. ఇఁక వీరియానతి నెట్లు నడపెదనో! ప్రాణేశ్వరి! లెమ్ము. మానీంద్రునిప్రసాదమును బడసి వచ్చితిని. ఓ మునిరాజులార! ఈవిషమసంధి యెట్లు వచ్చినది.

నార—ఈశ్వరకల్పుఁడైన దుర్వాసోముని యాజ్ఞకు వైషమ్యముండదే.

దూ—ఏమిజరగినదో చూచివత్తము రండు.

(అని నారదుఁడు, శిష్యుఁడు రాఁ బరిక్రమించును)

గంధ—ప్రాణేశ్వరి! నన్ను విడిచి యొంటిగా నరుగకుము హా! (అని విమానము పైఁ బడియుండును.)

దూర్వా—(చూచి) ఇది మూర్ఛ.

నార—ఈవిమానము నడపువా రెవ్వరు.

దూ—(ఆలోచించి) మంచిది. వీరి నిట్లే యుండనిండు. వీరిమానసములు కంచిలో నరాంశములం బొంది వృద్ధినంది కైలాసమున కేగఁబోవునపుడు వీ రీపుష్పకముమీఁదనే మరలఁ దేరుకొందురు.

నార—బాగుబాగు. గంధర్వులు నరు లగుటకు మంచిసులభోపాయము దొరకినది. మానివర నాకు సెల విమ్ము. మరల వీరితోనె వచ్చి పర్యవసానముం దెల్పెదను.

శిష్య—(తన) అంతవఱకు నాకీశవజాగరము తప్పదు.

దూ—తథాస్తు. కానిమ్ము.

ఇది క్రోధశాంతి యనుప్రథమరంగము.

# ౨. ప్రభుసందర్శనము.

(ఇద్దఱు రోగులు దంపతులు ప్రవేశింతురు.)

భర్త—వనితామణి! నాకు ముప్పది, నీకిరువదియైదు. ఈయీాడుననే మనయిరువురకు నేకకాలమరణము దైవము సంఘటించెనా.

భార్య—దైవవశమున కసాధ్య మున్నదా. వయసువా రేమి వృద్ధు లేమి.

భర్త—నీ కేమైనఁ గోర్కు లున్నవా?

భార్య—నాథా! నిన్ను వెంబడించుట యొక్కటే కోర్కి.

భర్త—నీవు కఠినహృదయురాలవు.

భార్య—నన్ను విడిచి పోఁజూచుటలో మీాహృదయము చాల మెత్తనిదా!

భర్త—అయిదేండ్లబుడుతఁడు, మూఁడేండ్లకుఱ్ఱది, వీరిగతి యాలోచించితివా.

భార్య—నాటు పోసినవాఁడు నీరు పోయఁడా!

భర్త—పెద్దవా రగునంతకు వారిని మనధనము నెవ్వరు రక్షించెదరు.

భార్య—దిక్కు లేనివారిని దేవుఁడే రక్షించును.

భర్త—వేదాంతము చాలును, దిక్కు లేకేమి, నీయన్నలు లేరా నాయన్న లేఁడా.

భార్య—మాయన్నలు చేరిరా "సర్వంనాశాయ మాతులః". మీాయన్నలు మీావారు, మీాయిష్టము. లేనివారు బాగుపడుకాలము.

భర్త—జ్ఞాతిగుట్టు, అరఁటికట్టు.

భార్య—మీాయన్నపై మీాకు విశ్వాస ముండవలయును.

భర్త—బిడ్డల కేదో గంజిపోసి పెంచును; ధనము చెడ్డది. ఇంతదనుక నన్ను ధనప్రసంగమునకు దింపక కాలము గడపుచున్నాఁడు - అతనిబిడ్డ లెట్టివా రగుదురో.

భార్య—బావగారినే నమ్మవలయును. ఏమైనను బరులపై నాకు విశ్వాసము లేదు.

భర్త—అంతయే - నాయనా! రంగా! పెద్దయ్యను బిలిచికొని రమ్ము.

(అన్న రంగని నెత్తుకొని ప్రవేశించును.)

సేవకుఁడు—(పీఠము వెట్టును.)

అన్న—తమ్ముఁడా! ఏలరా! నన్నుఁ బిలిచితివి, నేఁ డె ట్లున్నది.

తమ్ము—అన్నయ్యా! మాయిద్దఱస్థితియు నొక్క రీతిగా నున్నది.

అన్న—మీకు బెంగ యెక్కుడు. రోగులు లేరా, వైద్యులు లేరా, మీవంటి వారిం జూడము.

తమ్ము—రోగమునకై బెంగ లేదు.

అన్న—మతి యేమిటికి బెంగ. మనోవ్యాధికి మందు లేదు.

తమ్ము—తండ్రీ! రంగా! (కన్నీరు పెట్టుకొనుచు) చెల్లెలు వీథిలో నాడుచున్నది. దాయియొద్దికి నీవును బోయి యాడుకొమ్ము.

అన్న—(రంగని నాడించి దింపుచున్నాఁడు)

రంగ—(పోవుచున్నాఁడు)

అన్న—అబ్బ! యింత బేలలను జూడ లేదు.

గీ. పుట్టుకకు మున్నె తండ్రులు గిట్టినారు, పురుటిలోఁ దల్లు లెందఱో మరణమంది
రేమి? వారలు బ్రతుకరో యింద్రభోగ, మనుభవింపరొ బిడ్డల కడలనేల.

తమ్ము—అన్నయ్యా! ఈకుఱ్ఱవాం డ్రేమార్గమున బ్రదుకుదు రని చెప్పుము?

అన్న—ఆయుర్దాయ మున్నవారికి గడ్డిపఱక యడ్డుపడి పెంచును. మే ముందుముగదా!

తమ్ము—అదియే నాధైర్యము.

అన్న—నీ కాధైర్యము లేదు. ఉన్నచో నిట్లు కృశింపవు.

తమ్ము—ధైర్యము లేకయేమి లే.

అన్న—అడవి రక్షలేనియబలుండు వర్ధిల్లు.

తమ్ము—అట్టి యవశకునముమాట విన లేను.

అన్న—న న్నేల పిలిచితివి. నే నేమి చేయవలయును.

తమ్ము—నాబిడ్డలను బెంపవలయును.

అన్న—ఇది నీవు చెప్పవలయునా. నేను ముందైన నాబిడ్డలను నీవు పాఱ వైచెదవా?

తమ్ము—అట్టిమాటలే నేను విన లేను.

అన్న—సర్వవిధముల మీయిరువురకంటె నధికప్రేమమునఁ జూచెద.

తమ్ము—మీమఱఁదలిస్థితి వినుము.

గీ నేను నవ్వినవవ్వుఁ గుందినను గుందుఁ, దిన్నఁ దినుఁ బండఁ బండుఁ జానున్నఁ జావ
నున్నయది బ్రహ్మహత్య నా కెన్నవచ్చుఁ, గవలపిల్లలతలనొప్పి కరణి నుండె.

అన్న—మీయన్యోన్యానురాగ మట్టిది.

తమ్ము—కన్నబిడ్డలపైఁ గరుణ యుంచవలదా.

అన్న—అనువ్రతలైనసతులలక్షణము.

తమ్ము—బ్రదుకనిమ్ము - చావనిమ్ము - నామాటవినుము.

గీ. వేయిగద్యాణములు నఱవేయిటంక,ములును నొకలక్షదీనారములును గలవు
బిడ్డలిద్దఱు గృహమును బెద్దచేలుఁ, గలవు నీవిది యెఱుఁగుదుగాదె మున్ను.

అన్న—ఎఱుఁగుదును. వీని నన్నిటిని బీఱువోకుండ రక్షించెదను.

తమ్ము—చ. కొమరితఁ బెంచి పెండ్లి యనుఁగుంబతితో నొనరించి వేయిరూ
ప్యములను, నల్లువానికి సభాముఖమందున రెండువేలు ని
చ్చి, మిగులవేడ్కగా నొకరిశేఖర మందు లగింప కంపునాఁ
డు మగున కిమ్ము గద్దె లోకఁడున్నఅవేయిని సారెచీరకున్.

అన్న—ఇవి యన్నియు మీచేతులతో మీరు చేసికొనవలసినవి. మీకన్నులతో
మీరు చూచుకొనవలసినవి.

తమ్ము—మా కాయైశ్వర్యము పట్టలేదు.

ఉ. లేమిని లేదు లే దని చలించెడుబీదలు కన్నబిడ్డలం
గోమున గంజిపానకము గొంగళి పట్టుగఁ బెంచి ముద్దుగా
రాములు చూపి యోగ్యమును బ్రాయము నారసి యుత్సవంబులం
దా మొనరించి సంతతముదంబున నుం డ్రది మాకు లేదగున్.

అన్న—మీ రేదో కొంత యానందించితిరి కుఱ్ఱవాండ్రే యేమియు నెఱుఁగరు.

తమ్ము—దానికే నేను విచారించుచున్నాఁడను.

అన్న—మీ రేదో తప్పుటర్థములోఁ దీసికొనవలదు. మే మెంతమంది యున్నను
మీరు కాముగదా.

తమ్ము—దేవుఁడు గాని మీరు గాని యట్లు కావలయును.

అన్న—దేవుఁడు పైవిచారణ చేయుచుండ నేను రక్షించెదను.

తమ్ము—గీ. లక్షదీనారములకు నెలకు నెలకును, వచ్చువడ్డిని నాల్గవవంతు నీవు
గొనుచుబిడ్డలఁ బ్రేమతోఁ గనుచుఁ బెనిచి,మనుచునదినీకుఁ జెప్పఁగఁ బనియు లేదు.

కాని—క. దైవము నీవును బాపలు, జీవించు నుపాయ మరసి చిరకాలము సం
భావనఁ బెంచుఁడు విధి గత,జీవులయినఁ దద్ధనంబు చెందును నిన్నున్.

అన్న—ఏల యిట్టనెదవు. వారిబరు వెవ్వరు మోసికొందురు. ఇపు డాయోటి
మాటయేటికి.

తమ్ము—ఓహో గట్టియో కీడెంచి మేలెంచుట.

అన్న—మీరు వెంగఁగొని రోగముఁ బెంపక నిశ్చింతగా నుండుఁడు.

తమ్ము—రోగము నేను ర మ్మనిన వచ్చినదా?

అన్న—వెంగరోగములు కొన్ని తెచ్చిపెట్టుకొనునవి కలవు.

తమ్ము—నేను రోగము వచ్చు నని యెన్నఁడును దలఁపలేదు.

అన్న—ఈవైద్యుఁడు పదిదినములనుండి చూచుచున్నను—

తమ్ము—నాగ్రహచారమున కెవ్వరు కర్తలు—వీనిచేత నెందఱో బ్రదికిరి. వీనిని మార్పకుఁడు. నాకుఁ గొంచె మాయాసముగ నున్నది. కొంచెము తాళి రండు. ఈకాగితము సావకాశముగఁ జదివికొనుఁడు. (ఇచ్చును.)

అన్న—మంచిది(అని కాగితముం బుచ్చుకొని లేచును.)

తమ్ము—(భార్యతో)నామాటలు వినుచున్నదానవా?

భార్య—వినుచున్నదానను. బావగారితో రెండుమాటలు—

తమ్ము—అన్నయ్యా! మీతో నేమో చెప్పునఁట.

అన్న—ఎంతవెఱ్ఱి! ఆహా చెప్పుమనుము.

భార్య—నాసాహసమునకు క్షమింపవలయును. బిడ్డలకై నేను జీవింపవలయును గాని ప్రాణములకై కాదు. మీరు మాబిడ్డలను బెంపుఁడు; ఏమైనం జేయుఁడు మీకర్పించితిని. పెంచితిరా దేవుఁడు మిమ్ముఁ బెంచును. నమస్కారము. నాకు సెలవిండు. (ప్రక్కకుఁ దిరుగును.)

భర్త—ఎక్కడికి? నేను గూడవత్తును. ఒంటిగాఁ బోకుము. రంగా! రంగా!

(సేవకుఁడు ప్రవేశించును.)

భర్త—రామా! బిడ్డలుభద్రము. అన్నా నమస్కారములు. (కన్నుమూఁత.)

సేవ—(చూచి) హా! యెంతపని జరగుచున్నది. ఒక్కయదు గీయమ్మముందు. ధన మేమి సుగుణము లేమి యాయువు చెంతకుఁ బోలేవు.

(అని పోవుచున్నాఁడు.)

అన్న—హా! తమ్ముఁడా! అన్నదమ్ము లను ద్వంద్వము నేకశేషము చేసితివా. నీబిడ్డలను నీవలెఁ గాపాడఁగలనా.

గీ. అమ్మ యే దని నాయన యగపడఁ డని,యడుగు బిడ్డల కేమని నుడువువాఁడఁ
గడుపు తఱుగఁగ నేరీతిఁ గడపి పుచ్చి,మిమ్ము మఱపింపఁగలనొ నాతమ్ముగుఱ్ఱ.

(పోనిమ్ము అదృష్టవంతులు)

ఉ. ప్రేమను బెండ్లియాడి రొకరి న్విడనాడ రొకళ్లు రేఁబవ
ళ్లేమఱి యేని బంధుల సుహృత్తుల సాధుల బీదలం గడుఁ

గోమున నేకరీతిగనుఁ గొంచును గోరిన దెల్ల నిచ్చుచుం
దామును దించు వచ్చి రది దైవము మెచ్చెను జాలు వీరికిన్.

ఏడ్చి యేమి తెచ్చెదను: హా తమ్ముఁడా. అగస్త్యభ్రాత ననిపించుకొని నీయాఁతనే బ్రదికితిని. ఇంకను నీయాధారమే నాకు. నిస్సహాయుఁడ నైతిని! నీ వున్నప్పటి ధైర్యము నాకుండదు గదా!

(పరిక్రమించి ప్రవేశించి)

పసిపాపల నాచేతఁ బెట్టి నాసోదరుఁడు సపత్నీకుఁడై కాలవశము నొందెను. (ఆలోచించి) శ్రీరంగనీతులు గావు. నిజముగా మనుజుఁడు—

మ. తనతో నేమియుఁ దేఁడు వచ్చునెడఁ జేతం గొంచుఁబోఁ డేగుచోఁ
దనయున్నంతకు నాది నాది యని యాస్తిం జేర్ప నూహించు నే
ననుబోల్లాడితి నూనె రాచికొని యంటు న్నొంటు లే దాతఁడీ
ధన మెట్లార్జనచేసె నచ్చెరు వగున్ దైవంబు దా ముఖ్యమా.

ఎద్దులపైఁ బెటికించుకొని పోఁదగినంత ధనమున్న నాతమ్ముఁడు ముష్టెత్తు దినియెను. ఆపూఁట కాపూఁటవారము నేనును నాబిడ్డలు నీడ్చుకొని వచ్చుచున్నాము.

గీ. తండ్రి యొసఁగెను నాకును దమ్మునకును, దన గడించినధనము నర్ధ మొనరించి
కడలిపొంగుగఁ బెరిఁగెను గాలుఁ జేయి, వచ్చి తమ్మునిసొమ్ము నాస్వమ్ము వోయె.

గుణములేక చెడెదవా కూడులేక చెడెదవా. ఆతఁడు నన్న న్యాయము చేయలేదు. నే నాతని జెఱుపఁ దలఁపలేదు.

ఉ. ఉండినవాఁడు మెక్కెనను నూరక లేనియతండు పస్తుగాఁ
బండినఁ గాల మాఁగదు స్వభావమునం గమనించు విత్తవం
తుండయి తమ్ముఁ డుండె నొ గతుండనొ నిర్ధనుఁడైన నేను దా
నుండును మాట యొక్కటి జనోత్కరదూషణభూషణార్హమై.

ఇపు డొకకష్టమువచ్చినది. నరములేనినాలుక నలుగురు నాలుగు తెన్నులవారు.

గీ. కూఁతు పెండ్లికి నల్లునకును గొమార్త, చేతికిని సారెచీర కిచ్చెను విభాగ
మొనరఁగొడుకున కెల్లయునొసఁగెఁ బెంచు, దానికిని జెప్పె నాకుసార్థక్యమింత.

దీన నేను లోభగుణము చూఁపుట కవసరము లేదు. ఏమో డబ్బు పాపిష్ఠిది. తొల్లింటి చరిత్రము వినమా.

గీ. భోజునిగుఱించి ముంజుని బుద్ధివినమె, ధనము గుణమును మరలించు ధర్మమార్గ
మన్న నేమనియడిగించు నహహాధనము, జగమునం దెన్ని విధములసంచరింతు.

నే నీధనముం గాపాడుట యొక యెత్తు. బిడ్డలం బెంచుట యొక యెత్తు. లోకాపవాదము రాకుండ మంచిగంధమునం దొకకాలు నగ్నిహోత్రమునం దొకకాలును బెట్టి చరించుట యొక యెత్తును గా నుండును. నామఱందలు పలికిన సాహసవాక్యములు! ఓ వనితామణి!

ఉ. ఎన్నఁడు నీవు నాయెదుట నించుక పల్కవు బావగారికి
స్సన్నన చూపుదాన వతిమాత్రముగా నిది యేమి యంత్యమం
దిన్నటి మర్మభేదు లగు నే బళి నీవచనంబు లీశ్వరుం
డెన్నఁడె నీనిసుంగులకు నే నొకపాపము చేయఁ బూనినన్.

బాగుచేసినను బాడుచేసినను నేన కదా యింక—లోకమునకు భయంపడని క్రూరుఁ డుండునా! అడుగడునకు ధర్మసందేహములతో మరణించిన యోదంపతులార! ఇపుడు చూడుఁడు మీసంతానమును,

చ. చదువను వ్రాయనుం గఱచి సద్గుణముల్ సదసద్వివేకముం
జదురుఁదనంబు గౌరవము శాంతము గాంచను లేనివారికిం
గుదురదు కల్గియుం జదువుకోఁ దగదో యిది పల్లెటూరు చి
క్కదు తగుపాఠశాల యు నొకండును జక్కని యొజ్జయిచ్చటన్.

(దీని కుపాయ మాలోచింపనలయును.)

(పరిక్రమించి యిరువురు బిడ్డలతో వచ్చి)

ఈపదనున మిన్నకున్నఁ జిన్నవాండ్రు చెడుదురు. వీరిని రాజమహేంద్రమునఁ బెట్టి చదివింపఁ దలఁచితిని. అక్కడఁ బలువురు బందుగులు విద్యావంతులు పండితులు పాఠశాలలు పల్లెకూటములు గలవు. ఇదియంతయు నాభార్యకు నచ్చదు.

క. పాపము! వీరల విడువఁగ, నోపక వచియించె నెన్నియో ప్రతిబద్ధ
వ్యాపృతము లైనవాక్కులు, కోపించెన్ బుజ్జగించెఁ గొంపోకుండన్.

ముద్దుచే విడువనోప మేని మనముద్దుబిడ్డలవలెనే వీరును జెడెదరు. ఉపపత్తియున్నపుడు నూరకుండనేల యని నచ్చఁ జెప్పితిని. ఈపాపల కేమి తెలియును. తల్లివల దనిన వల దనిరి. నేను జదివింతు ననినఁ జదువ వత్తు మనిరి. (బిడ్డలంగాంచి) నాయనా! రంగా! రాముఁ డేఁడి?

రాము—(వచ్చి) ఇదిగో సిద్ధము.

రంగ—పెద్దనాయన! నన్ను రాముఁ డెత్తుకొనును.

తండ్రి—చెల్లెలిని నే నెత్తుకొందును. రంగనాయకి రావమ్మ!

బాలిక—(చంక నెక్కును.)

రాము—(రంగని నెత్తుకొని నడచును.)

రంగనా—పెద్దనాయన! ఇన్నిచె ట్లెందుకు?

తండ్రి—(నడచుచు) అమ్మా! ఇదియే యడవి. ఎక్కువచె ట్లున్నదే యడవి

రంగ—అనఁగా ననఁగా నొకయడవి—అని చెప్పినావే కథ.

తండ్రి—ఆఁ. అదియే యిది.

రంగనా—ఇం దెవ్వరున్నారు. చదువులబడి—

తండ్రి—ఇందు మనుష్యు లుండరు. పెద్దపులులు—

రాము—ఈయడవి నడ్డుపడి మనము మామయ్యగారి యూరికి వెళ్లెదము

రంగ—పెద్దయ్యా! పెద్దయ్యా! పెద్దపులి యేమిచేయును?

తండ్రి—ఆవులను మేఁకలను బట్టిచంపును.

రంగనా—అన్నయ్యా! చూచినావా.

రంగ—చెల్లీ! పెద్దపులిని జూచినావా.

రంగనా—బొమ్మచూచితిని. గొల్లపిల్లవాని నెత్తుకొనిపోవుచున్నది.

రంగ—పెద్దనాయన! పులి యావునుమేఁకను జంపక గొల్లపిల్లవానిని జంపెనే.

తండ్రి—ఏదో కథలో నట్లు చెప్పినారు.

రంగ—మనము భయపడకుండఁ జూడవచ్చునా?

రంగనా—పెద్దయ్యా! నాకుఁ బెద్దపులిని జూపింపవా.

తండ్రి—పోనుబోను గనఁబడును జూపెదను.

రంగ—ఇంక నెంతదూర మున్నదిబడి.

తండ్రి—ఇదిగో వచ్చినాము. ఎండతీక్ష్ణముగా నున్నది. రామా! ఇక్కడఁ జెట్టుక్రిందఁ గొంతసేపు కూర్చుందము.

రాము—అట్లే కానిండు.

(అందఱును గూర్చుందురు.)

తండ్రి—రామా! నాకు నిద్రవచ్చుచున్నది. నిన్న మొన్న రాత్రులు పెద్ద యోజనలతో నిద్ర పట్టలేదు. బిడ్డలను జూచుకొమ్ము.

రాము—పండుకొనుఁడు. వీరినిగూడ నిద్రపుచ్చెదను.

తండ్రి—(ప్రక్కవైచికొని నిద్రించును.)

రాము—అమ్మా! నీవు పెద్దయ్యగారియొద్దఁ బండుకొనుము. ఎండ వేఁడికి నీమొగము నిద్రకు వచ్చినది. (పండుకొనఁబెట్టి జోకొట్టును.)

రంగ— నేను నీబట్టపఱచుకొని పండుకొందును.

రాము—అట్లే పఱచుకొమ్ము. (అనిపఱచి పరుండఁబెట్టెను.) (తనలో) ఈ ఘోరవనముదారి నేలరావలయును. బండ్లులేవా యేల నడపించుకొని పోవలయును. గుర్రెక్కఁడు మంచినీళ్లు తెచ్చినాఁడా! చెంబు దెత్తునా యనిన దారిపొడుగున గుంటలే యనియెను. రెండురొట్టెలు చేతఁబట్టుకొందునా యనిన నెక్కడఁజూచినఁ బ్రతివృక్షమునఁ బండ్లే యనియెను. ఏమి తలంచి నాఁడో యెఱుఁగరాదు.

తండ్రి —(గుఱక వెట్టి పలవరింతలుగా) నాతమ్ముఁడు వ్రాసినకాగితములో నొక్కముక్కయున్నది. పెద్దవారు కాకుండ నాబిడ్డలు మరణించిన యెడల సర్వధనము నీకే చెందునని.

రాము—(విని) ఔర! వీనితలంపు.

తండ్రి—ఈతొడుసు విడుచుట యెట్లు.

రాము—(విని) తొడుసేమి, విడుచుట యేమి, నేనే యీతనికిఁ దొడుసునుగాఁ దోఁచి యుండవచ్చును. ఆహా; దురుద్దేశము లెట్లు బైలు వెడలుచున్నవి!

తండ్రి—వీనిని గాని వీరిని గాని చీఁకటిగుహాలోఁ బడవైచి—

రాము—(విని) చంపివేయరాదా.

తండ్రి—రాముని దీసికొనివచ్చుట పొరపాటు.

రాము—నే నిపుడే తప్పుకొందును.

తండ్రి—అన్నిశ్రీరంగనీతులు చెప్పిన నే నేమి తలంచుచున్నాఁడను. ధనాశ పెట్టిన రాముఁడు చెప్పినట్లు వినఁడా.

రాము—నేనా! కుడిచినయింటికిఁ గ్రుంగు దెచ్చెదనా.

తండ్రి—(గుఱ్ఱువెట్టుచున్నాఁడు.)

రాము—నే నిపుడు తప్పుకొనవలసినదే—మఱియీపిల్లలగతి. ఈదుర్మార్గుఁడు లేవకమున్నె వీరి నెక్కడికైనఁ గొంపోయిన—

రంగనా—నాకు బొబ్బకావలయును (నిద్ర లోఁ బలవరించును.)

రాము—ఇది గట్టిచిక్కే! నీటికై యెక్కడికిఁ బోదును.

రంగ—(నిద్రలో) అదిగోఁ పెద్దపులి.
రాము—ఏమియు లేదు పండుకొనుండు.
తంత్రి—(నిద్రలో) నేను లేచి రాముని బండుకొమ్మని వానితలపై బండ యెత్తి వైచెదను.
రాము—దుష్టుఁడా నాకు నిద్రపట్టునా. పదునాల్గేండ్లయినను లక్ష్మణస్వామివలె.

(అడవిలో నొకయల్లరి)

రాము—(విని ఓహో! ఇది యొకవిపత్తు—ఏమి చేయుదును. ఏమైనను మంచిదే-(అని మెల్లఁగ) నాయన రంగ! లెమ్ము: నీకొకమాట చెప్పెదను.
రంగ—(లేచుచున్నాఁడు)
రాము—(రంగనాయకిని లేపును)
రంగనా—(లేచి) యేమి చిత్రము చూపించెదవు.
రాము—మన మీచెట్టుమీఁద నెక్కి చిత్రము చూతము. క్రిందఁ జీమలున్నవి. పెద్దపులులు వచ్చును.

(అని యిరువురను జెట్టెక్కించును.)

తంత్రి—(గుఱ్ఱు పెట్టుచున్నాఁడు)
రాము—ఈతని గూడ లేపుదునా? వలదు. ఇట్లే యుండనిమ్ము. అడవిలోఁ గలకల మెక్కుడుగా నున్నది. నేనును జెట్టెక్కి బిడ్డలను గట్టిగాఁ బట్టుకొందును. (అనియట్లుచేయును) (ఒక్క తుపాకిధ్వని వినఁబడును)
రంగనా—రామా! ఇదియేనా చిత్రము.
రంగ—రామా! నాకు భయముగా నున్నది.
రంగనా— పెద్దపులి వచ్చును. భయపడకురా అన్నయ్య.
రంగ—నాకుభయము. పెద్దనాయన లేవలేదు.
రంగనా—పెద్దమనుష్యులను గఱవదు.
రంగ—ఏమిటి పులి యేది?

(అంతలో గాండ్రుమనుచు నొక్కపులి వచ్చి నిద్రించువానిగొంతు క్రొల్లఱచితానును వానియొద్దఁ బడును.)

రంగనా— రామా! ఇదియేనా చిత్రము.
రంగ—ఇదియా చాఱలమెకము. నాకుభయము.
రంగనా—పెద్దయ్య చెప్పినాఁడు—మనుష్యులను గఱవదు. భయపడవలదు.

రాము—బాబు! భయము లేదు. పులి చచ్చినది. (తనలో) వీనిపాలిటికి-వీని యూహాలకు వెంటనే ఫలముగదా.

(మనుష్యులధ్వని వినవచ్చును.)

రాము—ఏటువడి పాఱివచ్చిన యీపులిజాడలు దీయుచున్న యెవ్వరో వేఁట కాండ్రు వచ్చుచున్నారు గాఁబోలును. (అని చెట్టుదిగును)

(ఒకరాజును గొందఱును బ్రవేశింతురు.)

రాము—(ఎదు రేగి మ్రొక్కును.)

రాజు—(చూచి) కిరాతార్జునీయము జరుగునా యేమి. నేను గొట్టినపులిని నీవెట్లు పట్టుకొంటివి.

రాము—మహారాజా! నేనుగాదు. మీదెబ్బకే వచ్చి యిక్కడఁబడి చచ్చెను.

రాజు—నీవృత్తాంత మేమి. ఈచచ్చినవాఁడు నీ కేమి కావలయును.

రాము—మహారాజా!

ఉ. మీపరిపాలనంబున నమిత్రవిభూతి బృహత్పురంబు దా
దాపున నొక్కపల్లె విదితంబగుఁ గృష్ణసరస్సనాఁగ నీ
పాపలు దానిలోన ధన పాలుని సంతతి వీరిరక్షకై
యోపిచరింతు నేను బ్రభులోగ్రవనంబున నప్రమాదినై.

రాజు—ఈయుగ్రవనములోనికి రానేల?

రాము—మహారాజ!

మ. ధనపాలుండు సతీసమేతముగ మర్త్యం బుజ్జగించెం దదా
జ్ఞను సంరక్షకుఁ డయ్యె నన్న యితఁ డా సంసారికిం జెప్పి పె
ట్టెను గృత్యంబులు వ్రాఁతమూలమున ముట్టెం గొంతద్రవ్యంబు నే
మనువాఁడక్క గతిబుద్ధి తెచ్చె మము న న్యాయంబుగా భూమిపా.

రాజు—నా కర్థమగునట్లు చెప్పుము.

రాము—ఇది విషమసంధి ప్రకాశముచేయరాదు(అనిమెల్లఁగ) ఇదికారణము.

రాజు—(విని)దైవ మెక్కడ లేదు! మంచిది! నీవు వీరిని మాతోఁ గొనిరమ్ము. నేను దద్గ్రామాధికారికి నిజవృత్తాంతము వ్రాయించి నీతోఁ బంపించెదను. ఈపాపలను గాపాడుటకై తగినపాలకసంఘమును నిర్ణయించెదను.

రాము—మహారాజ! నాకంతే కావలసినది.

(బిడ్డలను జెట్టునుండి దింపి)ఈసార్వభౌమునకు మ్రొక్కుఁడు (అని మ్రొక్కించును.)

రాజు—(దగ్గఱదీసి చేతఁదట్టును.)

రాము—రండు మనము పోదము.

రంగనా—పెద్దయ్యను లేపుము.

రాము—నిద్ర మేల్కొని తానే వచ్చును. [illegible] మీప్రభువుగారితోఁ బోవుదము.

రంగ—మమ్మిద్దఱను నీ వొక్కడవే యెత్తుకొందువా.

రాము—ప్రభువుగారిగుఱ్ఱపుబండి యున్నది.

రంగ—చెల్లీ! రా. గుఱ్ఱపుబండి యెక్కుదము.

రాము—అజ్ఞానమా! నీవంటిదిలేదు. ఈబిడ్డ లేమి చెప్పిన నది నిజ మని నమ్ము నట్లు చేయుచున్నావు. ఓభగవంతుఁడా! గంపెఁడుకన్ను వెట్టుకొని చూడ కుండ నీ వూరకుంటివేని ప్రపంచము గతి యే మగును.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రభుసందర్శన మనుద్వితీయరంగము.

# ౩. దేవసహాయము.

---

(రాజును మంత్రియుఁ బ్రవేశించుచున్నారు.)

మంత్రి—మహారాజ! నన్ను క్షమింప వేఁడెదను. ఈమూఁడవసారి కూడఁ జూచి తర్వాత మీచిత్తము—నేను మాట లాడను.

రాజు—నీకేమి వెఱ్ఱి యెత్తినదో,

చ. తెలివి యొకింత గల్గ నొక తేపకుఁగా దొక తేప కైన నా
పలుకుఁ దలంపఁడే పడెడు పాటు సమస్తము వానిఁగూర్చి కా
దె లవము నన్ను నెన్నఁ డతి ధీయుతుఁ డందువు యోగమందు వేఁ
డెలియను వాని సద్గుణతతి స్మతి పోయినసొమ్ము వచ్చునే.

మంత్రి—మహారాజ! అట్లు కాదు. బుద్ధిశాలి. దయార్ద్రహృదయుఁ డగుట

ఉ. దీనుల యార్తి కోర్వఁ డొక దేశము కొల్లగఁ బోయి దుర్గతుల్
జ్ఞానవిహీనులన్ బుధుల సాదుల బీదలఁ బాపలన్ దయా
హీనత వృద్ధులన్ సతుల నెందఱనేఁ జెఱగొంచుఁ బోవ లో
లోన నెవం డుపేక్ష వదలుం గరుణింపక యట్టి పట్టున

రాజు— నా కీపని సమ్మతము గా లేదు. నాతలంపున కి

మంత్రి—మహారాజ! నామూర్ఖతకు మన్నింపవల

నవా రైనను నట్లు చేయువా రే. ాజు కావచ్చును. గంభీర

రాజు— స్వతంత్రుఁడనై నేను జేయుటలో రరత్నవర్తకుని యనుచరుని

బాలుఁడు చేయుటలో—నీకేమి భేదము

మంత్రి—అది లోపము కాదు గాని తనతోరి.

లోకాపవాదమునకు హేతువు.

రాజు—ఉ. యువరాజై భువనావనక్రియ

క్కువయే భార్యలు సత్కృతిదురు. రాజయోగ్యరత్నములు.

ట్టువుగోలెం దఱివేచి యున్న గట్టియుంటిమి. ఇతరుల కేపమిని.

యెవ రేవంకను దీనికై ష ధనము పోయి-దేశములోని జనులు

మంత్రి—మే మతిదూరమునం దున్న యి-యుభయకులదీపమైన పుత్రిక

అని బతిమాలికొనిన నెట్లయిన వ్యాపారిం జూచుట—రాజుననిప్రస్తు

సమ్మతించినాఁడు గాని భోగైకబుద్ధితోఁ దెచ్చినవాఁడు కాఁడు. కూడ నున్న దాది నడిగిన వాస్తవము తెలియఁగలదు.

రాజు—అట్లయిన నింక మూఁడవసారి జేహారము వలదు. భద్రముగా వారి నిద్దఱ వారియింట విడిచి యపకీర్తిం బొందకుండ రమ్మని చెప్పుము.

శా. వాణిజ్యం బొనరింప విత్తమిడి సద్వ్యాపారివై దీవుల
న్నానాంబుల్ నగలుం బసుల్ వసనధాన్యంబు ల్విదేశంపువి
న్నాణంబు ల్తెఱయించు చిత్రములు సన్నాహించి తేఁ బంప సు
ప్రాణు ల్వెట్టె మునింగికాయఁ గొనునిర్భాగ్యుండు వీఁ డౌనొకో!

మంత్రి—మహారాజ! సత్కార్య మెన్నఁటికిని వృథకాదు.

రాజు—ప్రపంచజ్ఞానము గడించు నని ధనమిచ్చి దేశదేశములకుఁ బోయి రమ్మనిన నొకసారి పన్నులిచ్చు కొనలేక శిక్షలం బొందఁబోవు వారి నుద్ధరింపను రెండవసారి కొల్లలోఁ జెఱపోవువారి నుద్ధరింపను వమ్ముచేసిన సొమ్ము సత్కార్యముక్రిందనే లెక్కకువచ్చిన మంచిదే. ఇఁక నేను ధన మీయను.

మంత్రి—వలదు వలదు. రాకపోకలధనము కళింగాధీశునిచే నిప్పించుకొని వచ్చును. చిత్తగింపుఁడు.

రాజు—నీవు నాపుత్రునికి మంత్రిగా నుండఁదగినవాఁడవు. అది యేదో చూచువఱకు నాపుత్త్రుని మొగము నేను జూడను. (అని లేచి వెళ్లును)

మంత్రి—(వెడలి పోవును)

రాజకుమారుఁడు—(ప్రవేశించి) తండ్రిగారిక్రోధము నాకు మేలే యొనరింపఁగలదు. నాశ్రేయోభివృద్ధికే వారి యీపరాఙ్ముఖత. నే నెఱుఁగక కాదు. మననుకరఁగి రెండుసారు లొనర్చితిని.

చ. ప్రతికులవృత్తిలో మనకుఁ బ్రాకటమై కనుపట్టు వంచనం
బితరు లెఱింగియుం ద్రెఉఁగ కేనియు మోసముఁ జెందుచుండు ర
ప్రతిమములైన వానిఁ బోలిపారిగ మాదిరి చూపి యిచ్చుచో
మెతకవి చెడ్డవస్తువులు మిశ్రపదార్థము లమ్ముచుండరే.

అట్లుకాక మంచివస్తువులనే సంపాదించి మంచివెలకే విక్రయించి నిలువయున్న చెడ్డవస్తువులను జెడ్డ వని చెప్పి యల్పక్రయమునకే యమ్మరాదా. లోకము పలుదెఱఁగులు. కోమటి కిట్లు బుద్ధిచెప్పి రత్నవ్యాపారి గాజురాయి యోగ్యరత్న మని యమ్మును. రత్నవర్తకుఁడు పట్టని జిల్లెడునారబట్ట లమ్మినఁ గొనును. ఇత్తడికి మెఱుఁగువెట్టి స్వర్ణకారుఁడు బంగా రని యిచ్చును. ఈతఁడు

పైపెచ్చు చేతకూలికూడఁ గొనును. ఏవర్తకములో మోసములేదు. ప్రపంచమే మోసము. అన్నియు నెఱింగిన నేను మోసపోదునా. దీనులంగని యోర్వ లేక యిట్లుంటిని. ఇపుడు చూడుండు. ఈకళింగరాజునకు రత్నవ్యాపారి నని తెల్పి నేను వీనిని నాయింటికి రప్పించెదను. సంజీవక! సంజీవక!

సంజీ—(ప్రవేశించును)

రాజకు—ఈనగర మెట్లో చేరితిమి గదా! రాజు కొలువుదీర్చియున్నపుడు నీవేగి కృష్ణాతీరస్థుఁడు రత్నవర్తకుఁడు వచ్చియుండెను. ఏలినవా రొక్కసారి దర్శనం బీయవలయు నని కోరుము.

సంజీ—వర్తకునే యందు రమ్మనిన?

రాజకు—ఇతరవ్యాపారములవలె నింటింటికిఁ దిరుగుపనికాదు. రత్నములగౌరవముం గాపాడుటకై రాజుల కందు వచ్చుటయే కర్తవ్యమనుము.

సంజీ—అట్లే చెప్పెదను.

రాజకు—అనినమాటలే యన నక్కఱలేదు. సమయానుగుణముగఁ బ్రసంగింపుము.

సంజీ—ఇదె పోయి వచ్చెదను.

రాజకు—శుభమస్తు.

సంజీ—(పోవుచున్నాఁడు.)

## ⟷ కళింగాధీశునికొలువు. ⟷

సంజీ—(ప్రవేశించి) ఈయున్నతపీఠాధివాసియే రాజు కావచ్చును. గంభీర విగ్రహము! (సమీపించి) మహారాజ! కృష్ణాతీరరత్నవర్తకుని యనుచరుని మ్రొక్కు స్వీకరింపుము.

రాజు—ఎన్నిదినములై యీపురమునకు వచ్చితిరి.

సంజీ—నాల్గుదినము లైనది.

రాజు—ఎక్కడను జనులు చెప్పుకొనుట లేదే.

సంజీ—కూరగాయ లైన జనులు చెప్పుకొందురు. రాజయోగ్యరత్నములు. అక్కఱగలవారికిఁ దెలియుటకై పేరుబల్ల గట్టియుంటిమి. ఇతరుల కేపమిని.

రాజు—(తనలో) ఆహా! ధనాగారములోని ధనము పోయి-దేశములోని జనులు పోయి-మనస్సులోని యుత్సాహముపోయి-యుభయకులదీపమైన పుత్త్రిక చెఱపోయి యున్నయిపుడు నాకా గత్న వ్యాపారిం జూచుట—రాజునని ప్రస్తు

తము తద్యోగ్యమైన బొంత గప్పుకొన్న నేను మర్యాదకైనఁ బోయి చూచి రాకున్న స్త్రీలు నవ్వుదురు. (ప్రకాశ) ఎంత దూరమున్నది.

సంజీ—సింహద్వారమున కించుక దాపుననే. కాలినడన వేంచేయవచ్చును.

రాజు—మంత్రీ! మన మిరువురమే పోయి వత్తము. (అందఱును లేచుచున్నారు)

రాజకు—(సందడివిని) రాజుగారు వచ్చుచున్నారు గాఁబోలు.

సంజీ—(ముందుగఁబోయి) ఇదె వచ్చుచున్నారు.

రాజు—(మంత్రితోఁ బ్రవేశించును.)

రాజకు—(ఇరువురకు నమస్కరించును )

రాజు—వ్యాపారిరత్నమా! ఏయే దేశరత్నములు మీయొద్దఁ గలవు.

రాజకు—నాయలవాటుచొప్పున నీదేశమున కీదేశరత్నములనే దెచ్చితిని.

రాజు—గళింగదేశములో రత్నము లుద్భవించునా.

మంత్రి—రత్నశాస్త్రములో లేదు.

రాజకు—శాస్త్రము భూమి రత్నగర్భ యని చెప్పెను గాని కళింగభూమి రత్నగర్భ కాదని చెప్పలేదు. స్థలనిర్దేశము లేదు.

రాజు—ఏవీ మేము చూడవచ్చునేనిం జూపుము. రెండురత్నములు.

రాజకు—నేనుదెచ్చినవియే రెండు. (అని పెట్టిమూఁత యెత్తి) మఱియు మీకొఱకే తెచ్చితిని. (రెండు పటములను జూపును.)

రాజు—(పుచ్చుకొనుచున్నాఁడు)

మంత్రి—ఇదియేదో మోసమే.

రాజకు—మహారాజ! ఇది నిష్కళంకకన్యారత్నము. ఇదివిశ్వాసపాత్రమైన ధాత్రీరత్నము. ఈరెండురత్నములును గళింగభూమిం బుట్టినవియే. (చూపిచెప్పును.)

మంత్రి—(తన) వీని కెట్లు లభించినవో.

రాజు—ఈమచ్చుముక్క లేనా నిజరత్నము లన్నవా.

రాజకు—చ. చెఱగొనిపోవుక్రూరుల కశేషధనం బిడి యోడనిల్పి యెం
దఱుగల రందు వారి నుచితంబుగ నొక్కొకరేవు సేర్చి యం
దఱ సుఖవృత్తి నిండులకుఁ దార్చి ముదంబున నీసుకన్య త
త్తఱపడ బుజ్జగించి వసుధావర నీకడ కిప్డు దెచ్చితిన్.

రాజు—నిరాశులకు నీ వూరట గల్గించుచున్నాఁడవు.

మంత్రి—(తన) ఈకన్య పోయిన దని యెంచుకొనియే నాకుమారునకు వేఱుచోటఁ బెండ్లిచేసితిని. ఇది యొక మోసము.

రాజకు—రాజయోగ్యము లగురత్నములపై దుర్బుద్ధుల కాసపుట్టును.

ఉ. ఎవ్వరొ పాఱవైచికొని రిక్కడ నబ్బెను భూషణంబు రం
డెవ్వరిదో యటన్న నగు నిచ్చోట నాయది వోయె నందు రా
నవ్వెవ రన్వయం బెడలి నామము రూపముఁ జెప్పలేని వా
రవ్విధమైనఁ జూపను నిజార్థము సైఁపుము నాప్రలాపముల్.

రాజు—మంత్రీ-ఇది నాకూఁతు రనుటకు సందేహ మేమి?

మంత్రి—పోయినకన్యలు దొరకుట దుర్లభము. వంచన కెన్నియో మార్గములు-యోజింపవలసిన దే.

రాజు—ఇం దేమిమోస ముండును. ఇది నా బిడ్డరూపమే.

మంత్రి—బొమ్మ యిదియే. తెమ్మనిన ధనము కావలయు నని నెలలోఁ దెత్తు, నక్కడ నున్నది యిక్కడ నున్న దందురు.

రాజు—సర్వాధికారములు గలనన్ను నట్లు మోసగింతురా.

మంత్రి—రాజులనే ముందు.

రాజు—అట్టివారి నొక్కరిని జెప్పుము.

మంత్రి—రాజవర్య! మోసగాండ్రు—

గీ. వేఱుపనస యనఁగఁ బృథివిలో నిలివెఁడు, లోఁతునందుఁ గాచు లోనినుండి
భూమి బ్రద్దలగును ఘుగఘుగ పరిమళ, మావరించుఁ బండినప్పు డనరె.
దాని విత్తుకావలయు ననిన నూఱులు వేలు హరించినవారు మనకుఁ
గన్నుల కప్పటికి నిప్పటికిఁ గనఁబడిరా.

రాజు—వారిం బోనిమ్ము గాని వేఱుపనస యున్నది.

మంత్రి—ఇట్టిపట్టే లోకమున నందఱకును గలదు.

రాజు—నట్టి భ్రమయే యందువా.

మంత్రి—కాకేమి. ఎవ్వఁడో బుద్ధిశాలి యొకటిరెండు చమత్కారము లిచ్చు దాఁక వా రట్లే యున్న దనుచుందురు.

గీ. స్వర్గమందునుండి స్వర్వేశ్యలను గూడ, ధనముపెట్టి దింపఁదగిన నీకుఁ
బనసవిత్తు నిచ్చి వలసినంతధనంబు, గొనఁగరాదొ వారు మినుకనేల.

ఇంకొక్కమాట వినుము, మూఢులను బోనిమ్ము, పండితులు-ఎఱ్ఱాప్రెగడరామాయణ మున్న దని పాండురంగవిజయ మున్న దని యథర్వణభారత మున్న దని సజ్జనులను మోసముచేయుచున్నారు.

రాజు—అప్పకవ్యాదులకుఁ గొన్నిపద్యములే దొరకినవా.

మంత్రి—అదియును విచారింపవలసినదే.

రాజు—ఈపటములే గాని నిజరూపములు గలనాబిడ్డయు దాసియు నీవర్తకుని యొద్ద నుండ రందువా.

మంత్రి—మనుష్యులంబోలిన మనుష్యు లుండవచ్చును.

రాజు—పనిగట్టి నన్నితఁడు మోసముచేయ రాఁబనేమి.

మంత్రి—నిజము నిలుకడమీఁదఁ దెలియును.

రాజు—అడిగి చూచెదను. వణిగ్వర! నాతనూజ ధాత్రీసమేతముగా సుద్యానములో నుండఁగా హరింపఁబడిన మాట సత్యము. నాదికానిది నాది యని కోరువాఁడను గాను. నాపై నీకు విశ్వాసము లేదా.

రాజకు—పెద్దవారు, ప్రభువులు, మీపై నాకు విశ్వాసము గలదు.

మంత్రి—(తనలో) చూపు నేమో. (బెదరుచున్నాఁడు.)

రాజకు—సంజీవక! లోనికిఁ బోయి వారిం దెమ్ము.

సంజీ—(అట్లుచేయుచున్నాఁడు.)

రాజకుమారి—(తండ్రిం గాంచి) హా! తండ్రీ. (అని కౌఁగిలించుకొనును.)

దాది—మహారాజ! ఆయుశ్శేషమున మరల మీపాదములు గంటిని.

(అని మ్రొక్కును)

రాజు—(కూఁతును బుజ్జగించి) వణిగ్వర్య! యింకను సందేహమా.?

రాజకు—గుసగుసలు వోవు నీమంత్రి నడుగుము. ఆయన మొగ మింకను దేఱలేదు.

రాజు—మంత్రి! నాకూఁతు రేనా. నాకూఁతురును మోసపోయినదా, నన్నుఁ దండ్రియని—

మంత్రి—ఇరువురయెడ మోసము లేదు.

రాజు—(కూఁతుతో) ఈరత్నవ్యాపారి మీవృత్తాంతముం దెల్పును.

దాది—మహారాజ! ఎక్కడివ్యాపారి! ఆంధ్రనృపాలుని పుత్త్రుఁడు.

రాజు—(ఆశ్చర్యపడుచున్నాఁడు.)

మంత్రి—(తెల్లపోయి చూచును.)

రాజపుత్రి—తండ్రీ! లుబ్ధవ్యాపారులా సర్వస్వము నిచ్చి చెఱవిడిపించువారు.

రాజు—అమ్మా! నిజము. వీనియెత్తుగడ మొదటినుండియుఁ గ్రొత్తగా నగపడుచున్నది. ఇక్కడ నుండనేల—రత్నవర్తకుఁడా. మాయింటికిరమ్ము రత్నములకుఁ దగినవెల యిచ్చెదను. (అందఱును బోయెదరు.)

సంజీ —(వచ్చి) తంత్రిగారికోపము మంచిపని చేసినది. విత్తనములు కూలిపనులు గూడ మిగిలినవి. రెండుసారులు పోఁగొట్టుకొన్న ధనమంతయు నిచ్చునఁట! నీవు సంపాదించికొన్న రత్నమును నీవేపుచ్చుకొమ్మని తనబిడ్డను మారాకొమరునకు నిచ్చి, పెండ్లికిఁ బిలిచికొని రమ్మని మారాజునొద్దికి నన్నుఁ బంపుచున్నాఁడు. ఈయానంద మంతయు నాది. నేనింతలో నాంధ్రదేశమునకుఁ బోయి వచ్చెదను. (అనిపోవును.)

రాజు—(ప్రవేశించి) ఊరకున్నఁ గ్రొత్తవారి కిచటఁ దోఁపదు. వినోదముల కేమియాలోచనము

రాజకు—(ప్రవేశించుచున్నాఁడు.)

రాజు—ఈ దేశము నీవెప్పుడును వచ్చియుండవు.

రాజకు—ఇదియే ప్రథమము. ఈసమీపమున విశేషములేమి.

రాజు—జగన్నాథక్షేత్రము దర్శనీయము. ఇష్ట మున్న మనయోడమీఁదనే పోయి రావచ్చును.

రాజకు—స్థలచరిత్ర మెఱిఁగినవా రొకరు దారి చూపవలయును.

రాజు—మామంత్రికుమారుఁ డందు నిపుణుఁడును—

రాజకు—అట్లయిన మంచిదియే.

రాజు—రమ్ము. ఆయేర్పాటు చేయవచ్చును.

(నిష్క్రమణము.)

మహాసముద్రములోనొకతిప్ప.

రాజకు—(ప్రవేశించి) ఏమి యుద్దేశించి యీమంత్రికుమారుఁడు నన్నిట్లు చేసియుండును! పరాకుగాఁ గూర్చున్నపు డోడమీఁదినుండి క్రిందికిఁ ద్రోసినాఁడు. ఆయుర్దాయశేషమున నీతిప్పఁ జేరితిని. దైవమా! నాగతి యింతేనా! ఇంకఁ గొన్నినాళ్లలో మృతినొందెదను. నేనేమి పాపముచేసితినో త్రాగుటకైనఁ బనికిరాని యుప్పునీటఁ బాలునైచితివి. ఇక్కడ నెవ్వరుందురు! ఈకడలిలో నీద్వీపము నాకొఱకే నిర్మింపఁబడినదా. ఒక్కమృగములేదు, చెట్టులేదు పిట్టలేదు. ఈదీవిం జుట్టి వచ్చెదను. ఎక్కడనైనఁ దరణోపాయము దొరకునేమో (చూచి) అదిగో నెవ్వఁడో చేఁపలు పట్టుచున్నాఁడు. వాఁ డేమైన నాకు సాయపడఁడా. (నడచును.)

చేఁపలవాఁడు—(రాజకుమారుం జూచి దూరముగాఁ బోవును.)

రాజకు—ఎవరయ్యా నీవు. నాపాలిటికి-

చేఁప—మాటలాడకు, చేఁపలుపడవు, ఎవరయ్యా నీవు నాపాలిటికి.

రాజకు—దినమున కెన్ని చేఁపలు దొరకును.

చేఁప—దొరికినన్ని దొరకును, నీమూలమున నేఁ డొక్కటియు లేదు.

రాజకు—న న్నొడ్డుఁజేర్చితివా నీకు నేఁటిచేఁపల వెలకంటె నెక్కు డిచ్చెదను.

చేఁప—నీ వెంతయిచ్చెదవు. నీయొద్ద నేమియు లేదే.

రాజకు—నీ కెంతకావలయునో ముందే చెప్పుము.

చేఁప—నీ కేమియుద్యోగము. జీత మెంత?

రాజకు—నిర్భాగ్యుఁడను నా కేమియుఁ బనిలేదు.

చేఁప—ఎప్పుడైన భాగ్యమబ్బినపుడు దానిలో సగ మిచ్చెదవా.

రాజకు—అబ్బినయెడల నట్లే యిచ్చెదను.

చేఁప—అట్లని వ్రాసి యిమ్ము.

రాజకు—ఇక్కడఁ గలమా కాగితమా. ఒడ్డుచేరి వ్రాసియిచ్చెదను.

చేఁ—రేవుదాఁటిపన దేవతగులఁబెట్టెదవు. నేను దెచ్చెదను-ఇదిగో-ఎండుపట్టె సావడిచేఁప తాఁటియాకువలె నున్నది. ఈమునివాలుగుముల్లుతో వ్రాయుము

రాజకు—(అట్లు వ్రాయుచున్నాఁడు.)

(అంతలో నొక తెప్ప వచ్చును. ఇరువురు నెక్కి నడుపుదురు.)

రాజకు—ఒడ్డుచేర్చి పడవ మరలించి యొక్క తెరచాటునఁ బడి మరలఁ గనఁబడకుండఁ జేఁపలవాఁడు పోయినాఁడు. ఇది యేదేశమో. కళింగనగర మిక్కడి కెంతదూరమో. ఆహా! మంత్రికుమార! నీయుద్దేశమేమి? నోటిలో నాలుక యున్నఁ గళింగదేశము చేరలేనా. ఉనుఱు లున్నఁ దిండిదొర కదా! (చూచి) ఆవచ్చువా రెవ్వరో వారి నడిగెదను.

కొందఱు—(వచ్చుచున్నారు.)

రాజకు—అయ్యలార మీదేయూరు.

కొందఱు—నీదేయూరు నీవెక్కడికిఁ బోయెదవు.

రాజకు—నేను గళింగదేశము పోవలయును.

కొందఱు—మేము నక్కడకే పోయెదము.

రాజకు—నన్నుఁగూడ మీతో రానిండు.

కొంద—మాపనిమీఁద మేము పోయెదము.

రాజకు—ఏపనిమీఁదఁ బోయెదరు.

కొండ—రాజుగారి యల్లుఁ డెందో పోయినాఁడు. ఓటి యోడ తిరిగి వచ్చినది. వానిని వెదకుచున్నాము.

రాజకు—నేనాయన యున్నతా వెఱుఁగుదును. నన్నురాజు నెదుటఁబెట్టితిరా చెప్పెదను.

కొండ—నీకెట్లు తెలియును.

రాజకు—మేమిద్దఱము నొక్కింతదూరము ప్రయాణము చేసినాము. నే నెఱుఁగుదును. మీకు లాభమగును, నన్ను రాజునకుఁ జూపుఁడు.

కొండ—ఆతఁ డెట్లుండును.

రాజకు—రాజుకొడుకులాగున నుండును. అంతేయు నే నెఱుఁగుదును.

కొండ—అట్లయిన మాతో రావయ్యా బాబు మాకేమైన దొరకఁగలదు.

(అని తీసికొనిపోదురు.)

(ఒక ముసలివాఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఓనాయనలార! రాజుగారికూఁతు పెండ్లి యైనదఁట. అల్లునకు రాజ్య మిచ్చినాఁడఁట. నే నారాజకుమారుని చిన్నతనములోఁ జూచినాను. వానియొద్దికిఁ గొనిపోరా. నాకేమైన దొరకఁగలదు. (నడచును) ఇది రాజభవనద్వారము వలె నున్నది. (విని) ఏమి! రాజుగారు సభచేసి యున్నారా! నన్నక్కడికిఁ గొనిపోఁగలరా! (విని) అది మీకెందుకు నాకు ముసలివానికి వేషమెందుకు. నేను వారిని జూడఁగోరెదను. వారు నన్నుఁ జూచి కొంత తెలిసికొనవలసియున్నది. సరే! మెల్లఁగాఁ బోయెదను.

(రాజసభ-మంత్రిమొదలగువారితోఁగొలువు.)

ముసలి—(ప్రవేశించి) తెప్పలెత్తి అయ్యలార! పెండ్లికొడు కెక్కడ! క్రొత్తరా జెవ్వరు.

రాజకు—ఏమి తాతా! నేనే యిటురా.

ముసలి—(తెప్ప లెత్తిచూచి) మీసకట్టు వచ్చినది, పడుచు దొరకినది, రాజ్యము లభించినది. నన్ను మఱచిపోయినావు.

రాజకు—క్షమింపవలయును నిజముగా మఱచితిని.

ముసలి—తెలిపించెదను. అని వ్రాఁతమూలము పొడుగుచేఁపను దీసిచూపును.

రాజకు—(చదివి) తాతా! నిల్చినావు. ఈపీఁటపైఁ గూర్చుండుము.

ముసలి—నాకలవాటు లేదు. నిలువఁబడియెదను. నామాట యేమి.

రాజు—తాతా! ఇదిగో నాభాగ్యములో మొదటిది రాజకన్య.

ముసలి—(నవ్వుచు) ఇదీ దీనిని నీవు స్వీకరింపుము.
రాజు—ధనము దొరికినది.
ముసలి—"చెఱిసఖాయిస్వాహా."
రాజకు—రాజ్యము దొరకినది.
ముసలి—నేనువృద్ధుఁడను. రాజ్యమేలలేను. ఏఁటేఁట సగము పన్ను నాకిమ్ము.
రాజకు—నాతండ్రిరాజ్యమును నాకేలభించినది.
ముసలి—క్రొత్తగా దొరకినదానిలోనే నాకు "వాటా"
సభ—(అందఱును దెల్లపోవుచున్నారు.)
రాజకు—నీవు నాతో భాగస్వామి వైతివిగదా.
ముసలి—అయితిని. మీమామగారికి నన్నుఁ జూపి చెప్పవా.
రాజకు—అల్లవారె, సింహాసనముమీఁద.
ముసలి—(చూచి) అయ్యో. నే నేమి చెప్పుదును. మీకేమియుఁ దెలియదు.

ఉ. మంత్రికుమారుఁ డీతనికి మార్తుఁడు మీఁదరయంగ లేదు దు
స్తంత్రము చేసి సంభ్రమున జాఱగఁ ద్రోఁచెను దీన నబ్బునే
జంత్రపుబొమ్మ నీతనయ జాల్మున కాతని బుద్ధిగాలె నా
మంత్రము సుమ్ము సర్వము నుమారమణుం బొగడుండు నెమ్మదిన్.

రాజు—మహాత్మా! ఇంతకంటెను గలదా.
ముసలి—నీయల్లునివలననె నీకు సకలము నింకఁ దెలియఁగలదు. నాకు సెలవిమ్ము.
రాజు—అయ్యో! ఈవృద్ధదశలో నెక్కడికి మాయింటనే యుండుఁడు.
ముసలి—ఎప్పటికిని మీవాఁడనే, నా కుండఁ దీరదు.
రాజకు—(భార్యతోవచ్చి మ్రొక్కును.)
ముసలి—(చేయెత్తి) కళ్యాణమస్తు! (అని చంద్రశేఖరుఁడై నిలుచును.)
రాజకు—(భార్యతోఁగూడ.)

క. శ్రీమదుమారమణా ప్రజ్ఞామేదుర మన్మనోంబుజనివాసా భి
త్తౌముఖవిపాంతభక్షణ, సామర్థ్యస్ఫుటతరాత్తసర్వజ్ఞత్వా.

(తెఱలో)—మంత్రికుమారుఁ డెందో రాత్రియే బెదరి పాఱిపోయినాఁడు.
ఈశ్వరుఁడు—సరి తీరినది. నిష్కంటకముగా రాజ్యమేలుచు సుఖులై యుండుఁడు.
(అనినిష్క్రమించును.) (అందఱును నిష్క్రమింతురు.)

ఇది దేవసహాయ మనుతృతీయరంగము.

---

